అంబాదర్శన గ్రంథమాల - 32

# వైదిక వర్ణ వ్యవస్థ

"కళాప్రపూర్ణ" పండిత గోపదేవ్

ప్రకాశకులు :

ఆర్య సమాజము - కూచిపూడి

గుంటూరు జిల్లా - ఆంధ్ర ప్రదేశ్

# వైదిక వర్ణ వ్యవస్థ



పండిత గోపదేవ్



ప్రకాశకులు :

**ఆర్యసమాజము - కూచిపూడి**

గుంటూరు జిల్లా.

ఓమ్

# వైదిక వర్ణవ్యవస్థ

భారతీయులు మానవసృష్టి యేర్పడిన నాటినుండియు వైదికులు. వేదవిహితధర్మముల నాచరించువారు. వారిలో వర్ణవిభాగము, ఆశ్రమ విభాగము నను నవియు నతిప్రాచీనము లనుటలో నేరికిని అసమ్మతము కాదు.

కాని నేడు భారతీయులలో వర్ణవిభాగమునకు బదులు కులవిభాగములు మెండుగ కనిపించుచున్నవి. నేటి పండితులు, పామరులు నెల్లరు కులము, జాతి, వర్ణము ననుపదములను సమానార్థకములుగ వాడుచున్నట్లు చూడనగును. నేటి చదువరుల వ్యవహారమునందును మానవు లెల్లరు నొక్కజాతికి చెందినవారుగా కనిపింపరు. పాశ్చాత్యులు - నల్లగానుండు ఆఫ్రికాదేశవాసులు మున్నగువారిని తమకంటె భిన్నజాతికి చెందినవారినిగా నెంచి వారియెడ నమానుషముగ వర్తించుట యెవ్వ రెఱుగరు! నేటి చరిత్ర రచయితల దృష్టిలో కూడ హూణులు, మంగోలియనులు, ఆర్యులు, ద్రవిడులు నని యెన్నో భిన్నజాతులకు చెందిన మానవు లున్నారు.

ఇక భారతదేశమున నివసించు మానవులలో గల జాతులకు అంతు - పొంతు కనిపింపదు. మానవులెల్లరు నొక్కజాతికి చెందినవారే యని మాదృశు లెవరైన పలికిన నది తప్పిదముగా నెంచబడును. ఇక్కడ హిందువు లనబడువారు తమలో నెన్నో జాతులు, ఉపజాతులు కల్పించుకొని ఒకరి కొకరెంతో దూరముగ నున్నారు. ఒకరిపొత్తు మఱియొకరికి గిట్టదు. ఒకరి శ్రేయస్సు నింకొకరు కోరరు. హిందువులలో గల నేటి పారస్పరిక వ్యవహారము నొక్కసారి తిలకించినపుడు

వారొక్కజాతికి చెందినవా రనుట కెట్టి యాస్కారము కనిపింపదు. ఒక వ్యక్తి మఱియొక వ్యక్తిని జూచినపుడు 'మీ రెవరు' అని ప్రశ్నించును. ఈ ప్రశ్నము మిక్కిలి సామాన్యము. నేను ధర్మప్రచారకుడ నగుటచే భిన్నభిన్న గ్రామములకు, నగరములకు, ప్రాంతములకు నేగుచుందును. వెళ్ళిన తావులలో నన్నియెడల 'మీ రెవరు' అను ప్రశ్నకు సమాధానము చెప్పక తప్పలేదు. ప్రశ్నించువారివలె నాకును ముక్కు, మొగము, కాళ్ళు చేతులు, ఇతరావయవములు నున్నవి. తినుటలో, త్రాగుటలో, నిద్రాది వ్యవహారములలోను నెట్టి భేదముండదు. ఈ విషయము లన్నియు తెలిసినమీదటను 'మీ రెవరు' అని ప్రశ్నించినపుడు వారికి నేనేమి సమాధానము చెప్పవలయునో తోచక 'నేను మనుష్యుడనే' యని సమాధానము చెప్పుచుందును. ఆ సమాధానము వారికి తృప్తి కలిగింపక మరల 'అది కాదండీ, మీరు మనుష్యులే కాని మీ రెవరో తెలియక అడుగుచున్నామండీ ! మీరే మనుకోవద్దు.' అందురు. అటుపైని కొంచెమాలోచించి నేను క్రైస్తవుడనో, మహమ్మదీయుడనో, బౌద్ధుడనో, జైనుడనో లేక హిందువునో తెలిసికొనగోరి ప్రశ్నించుచున్నారేమో యని యెంచి వారి తృప్తికొఱకు 'నేను హిందువు'నని చెప్పుదు నమకొనుదు. అప్పుడును 'మీ రెవరు' అను ప్రశ్నము నన్ను విడువదు. 'అది కాదండీ, మీ మాటలు, మీ తీరుతెన్నులు చూడగనే మీరు హిందువులే యని తెలియుచునే యున్నది. అయినను మీ రెవరు?' అని మరల ప్రశ్నింతురు. ఇప్పుడేమి చెప్పవలయునో నా కర్థముకాదు. హిందువని చెప్పుకొనుటయే నాకు సరియైన సమాధానముగ గనిపింపదు. హిందువు, క్రైస్తవుడు, మహమ్మదీయుడు మున్నగు పదములు ఆ యా తెగలకు సంబంధించినవా రనుసరించు మతములను దెలుపు పదములగును; కాని మఱియొందు కాజాలవు' నీ వే మతమునకు జెందినవాడవు? అని ప్రశ్నించినపుడు 'నేను హిందువును, క్రైస్తవుడను, లేక మహమ్మదీయుడనో' యని చెప్పుట యుచిత

మగును. ఈ యౌచిత్యమును పాటింపకయే 'నేను హిందువు' నని చెప్పి నను సంతోషింపక మరల మీ రెవ రనిన ఏమి చెప్పవలయునో తోచక 'నాపేరు గోపదేవ్. నేను ధర్మప్రచారము చేయువాడను.' అని చెప్పుదు ననుకొనుడు. ఆ సమాధానము కూడ వారికి సంతృప్తిని కల్పింపదు. అందువలన వారు మరల 'అది కాదండి, మే మడుగునది : మీరు ధర్మ ప్రచారకు లనియు మీపేరు 'ఫలానా' అనియు మాకు మిమ్ములను పరిచ యము చేయు కరపత్రములవలన తెలిసినదండీ : అయినను మీ రెవరో తెలిసికొనవలయునని యడుగుచున్నా మండి. మీరు అన్యథా భావింపకండి, అందురు. ఇప్పుడు వీరి కేమి చెప్పవలయునో, ఎట్లు చెప్పవలయునో తోచక యీ ప్రశ్నకు కులగోత్రములు సమాధాన మేమో యని యెంచి 'నేను మాలవాడ నండి' అందు ననుకొనుడు. ఆ సమాధానము కూడ వారికి తృప్తి కల్పింపదు. 'అయ్యో, మీ రామాట అంటే, మేము నమ్మరా మండీ; మేమంత తెలివితక్కువవార మటండీ; మీ కేదో కోపము వచ్చిన ట్లున్నది. మీరు మాలవా రెట్లవుదురండీ; మీ విద్య, మీ సంస్కారము, మీమాటలతీరు చెప్పదటండీ : మీరెంత దాచినను దాగుతుం దటండీ : కాబట్టి అసలు మీ రెవరో తెలిసికొనవలయునని అడుగుచున్నామండి. మీరు బ్రాహ్మణులే. అందులో సందేహము లేదులెండి. కాని వైదికులా? నియో గులా ? అనేది తెలియక లెండి మా ప్రశ్నలు : అందులోను నియోగులు కారనియే మా నమ్మిక. వారి కీ శాస్త్రపాండిత్యము : ఇది యెక్కడినుండి అబ్బుతుంది? అందువలన మీరు వైదికులేకాని, వెల్నాటివారో, వేగినాటి వారో, మురికినాటివారో తెలిసికొనవలయునని మా తాపత్రయము.' అందురు. ఇట్టి స్థితిలో వారికి నేనేమని చెప్పవలయునో అర్థముకాక తికమక పడవలసి వచ్చుచుండును. నేను వారియింట తినుటకుగాని, త్రాగుటకుగాని వెళ్ళ నైతిని. వియ్య మందుటకైన వెళ్ళినవాడ గాను. అట్టియెడ నన్నుగూర్చి 'మీ రెవరు' అను నీ ప్రశ్న మెందులకు ? నాకులగోత్రములను దెలిసి

కానినందున వారికి వచ్చు ప్రయోజనమేమి? ఏమియు లేదు. ఇది యంతయు 'నే నే జాతి కుల వర్ణములకు జెందినవాడనో తెలిసికొని, అడిగినవారి కులమునకు జెందినవాడ నగుపక్షమున నాకింత సంతోషించుటకో లేక యాదరించుటకో చేయుపరిశ్రమము. అంతకు మించి మఱియొండు కనిపింపదు. నేను వారిజాతికి, కులమునకు, వర్ణమునకు జెందినవాడను కాను, అని తెలియగానే నా విద్వత్తు, నా సంస్కారము, నా వాక్చాతుర్యము, ఇతరగుణగణములు నన్నియు కొఱగానివి యగును. నేను పనికి మాలినవాడ నగుదును. ఇదియే యీ ప్రశ్నకు ఫలము. భారతీయులలో నేడు మిక్కిలిగా వెఱ్ఱితలలు వేసిన యీ జాతిభేదమువలన దేశమునకు, మానవజాతికి కలిగిన దుష్పరిణామమును కొన్నిపంక్తులలో వర్ణింప నెవ్వరికిని తరముకాదని నాయభిప్రాయము. వాస్తవమున జాతి, కులము, వర్ణము లనుపదములందును, వానియర్థములందును గల భేదము హిందువులు గుర్తింపకున్నారు.

ప్రపంచదేశములలో గల మానవు లెల్లరు నొక్కజాతికి జెందినవారే. రంగు, ఆహారములు, భాషలు, ఒడ్డుపొడవులు, అవయవములలో గుండ్రనిమొగము, కోలమోము, పెద్దముక్కు, చిన్నముక్కు, సొట్టముక్కు ననుభేదములను పురస్కరించుకొని మానవులు పలుజాతులకు జెందినవారని యెంచుట అవివేకము. జాతియన జన్మము. మానవులు జన్మమునుబట్టి ఒక్క తెగకు - జాతికి జెందినవా రనుటలో నెట్టి సంశయము లేదు. న్యాయశాస్త్ర (తర్కము) రచయిత యగు గోతమ మహర్షి జాతిపదము నెట్లు నిర్వచించినాడో చూడుడు:

'ఆకృతి గ్రహణా జాతిః' - న్యా. ద.

'జాతి ఆకృతి - ఆకారమువలన గ్రహింపదగినది.' అని సూత్రార్థము. ఆకారమునుబట్టి మానవు లెల్లరు నొక్కజాతికి జెందినవా రనుట కభ్యంతర ముండదు. రంగులో, కొలతలలో నొక్కింత భేదమున్నను

అవయవసంనివేశమును బట్టి మనుష్యుడు మనుష్యుడుగా గ్రహింపబడు టలో నెట్టి సందియము నుండదు. వ్యక్తులలో నెంత భేదమున్నను ఇతడు మనుష్యుడే 'ఇతడు మనుష్యుడే: ఇతడు మనుష్యుడే' అని యందఱి లోను మనుష్యుడే యను సామాన్య జ్ఞానము కలుగును. అట్టి సామాన్య జ్ఞానము కలుగుటకు, ఆ వ్యక్తు లందఱిలోను నేదియో సామాన్య ధర్మము ఒకటి యుండవలయును. అదియే మానవత - మానవత్వము. దానినే జాతియని నైయాయికు లందురు. ఇట్లే పశువులలో గోత్వాదులు నని యెఱుంగ నగును. ఇట్లు మానవులు, గోవులు, అశ్వములు, వ్యాఘ్ర ములు, శునకములు మున్నగు ప్రాణులు భిన్న జాతులకు జెందిన వని గుర్తించుట యెల్లరకు సులభము. ఆకృతులను బట్టియే యవి భిన్నజాతు లని తెలియును.

గోతముడు, నవ్య నైయాయికులు చెప్పిన లక్షణములను బట్టి మానవు లెల్లరు నొక్క జాతికి చెందినవా రనియే తెలియుచున్నది. అయి నను హిందువులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, ఇంకను చాకలి, మంగలి, మాల, మాదిగ మున్నగు వందలాది పదములు భిన్న భిన్న జాతులను తెలుపుచున్న వనియు, వీరెల్లరు నొక్క జాతికి చెందినవారు కారనియు నెంచుచున్నారు: వ్యవహరించుచున్నారు. పైని వర్ణించిన బ్రాహ్మణాది పదములచే వ్యవహరింపబడువారి పిల్లలను పలువురి నొక్కచో జేర్చుడు. వారికి భిన్న భిన్న వేషభాషల నమర్చక పుట్టినవారిని పుట్టినట్లు నగ్నులుగా నిలబెట్టుడు. వారి యాకృతులను జూచి యెంతటి విజ్ఞుడైనను, ఎంతటి కొమ్ములు తిరిగిన పండితుడైనను వారిలో బ్రాహ్మణ బాలు రెవరో, క్షత్రియబాలు రెవరో, వైశ్య శూద్రుకులజు లెవరో, మాల, మాదిగ, చాకలి, జంగమ బాలు రెవరో గుర్తింపగలడా? గుర్తింప జాలడు. అందఱిని మనుష్యుల పిల్లలనుగా గుర్తించుటలో నెవ్వడును పొరబడడు. మానవ బాలురను మానవులనుగా - మానవజాతికి చెందిన

వారినిగా గుర్తించుటకు విద్వత్తు - పాండిత్యము ఏదియు నవసరముండదు. ఆకృతి యెల్లరకు సులభగ్రాహ్యము. కావున మహర్షి చెప్పిన ఆకృతి (ఆకారము) చే జాతిని గుర్తించుటలో నెవ్వరును పొరబడవలసిన యవసరమే యుండదు.

ఇంతే కాక మహర్షి గోతముడు జాతిని గుర్తించుటకు మఱియొక లక్షణముకూడ చెప్పియున్నాడు.

"సమాన ప్రసవాత్మికా జాతిః"

లోకమున నే యిరువురు స్త్రీ పురుషులు కలిసి మైథునము ద్వారమున తమవంటి సంతానమును గందురో ఆ స్త్రీ పురుషు లిరువురు నొకే జాతికి చెందినవారని పై వాక్య తాత్పర్యము. సంతానపుటాకృతిని బట్టియు మాతా పితరుల జాతిని నిర్ణయింప గలమని యభిప్రాయము. ఈ లక్షణమునుబట్టి చూచినను బ్రాహ్మణత్వము, క్షత్రియత్వము, వైశ్యత్వము, శూద్రత్వము, రజకత్వము, నాపితత్వము, చండాలత్వము మున్నగునవి భిన్నజాతులు కావని స్పష్టమగుచున్నది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులు భిన్నజాతులకు చెందినవారు కారని పై లక్షణములనుబట్టియు ఋజువగు చున్నది. కారణమేమన బ్రాహ్మణు డనబడువాని పుత్రికను వైశ్యుడని పిలువబడువాని కుమారుడు పెండ్లి చేసికొని సంతానము కనుచుండును. ఆ సంతానము తల్లి దండ్రులంబోలి యుండునే కాని విపరీతముగా నుండదు గదా! కావున బ్రాహ్మణపుత్రిక, వైశ్యకుమారుడు నిరువురు నొకేజాతి - మానవజాతికి చెందిన వారనుటలో నెట్టి దోషము లేదు. వా రిరువురు భిన్నజాతులకు చెందినవారగు పక్షమున వారి మైథున క్రియ (దాంపత్యము) వలన వారిరువురిం బోలిన మానవ సంతానము కలుగక యుండవలసినది.

భిన్న జాతులకు సంబంధించిన స్త్రీ పురుషులలో సంపర్కము కలుగుటయే సంభవము కాదు. సింహము గోవుతో సంపర్కము చేయ

గలదా! కృత్రిమ సంబంధ మెటులైన కల్పించినను వాని సంబంధము వలన సంతానము కలుగనేరదు. ఒకవేళ కలిగినను ఆ స్త్రీ పురుషుల యాకృతిని బోలిన యాకృతి గల సంతానము కలుగదు. చూడుడు: గుఱ్ఱము, గాడిద యను జంతువుల యాకృతిలో కొంత సామ్యము చూతుము. వాని పరిమాణములో భేదమున్నను ఆకృతి సామ్యము చూడనగునని యాశ యము. వాని సంపర్కమువలన కలుగు సంతానము గుఱ్ఱముకాక, గాడిదయు కాక రెంటికి భిన్నముగా కంచరగాడిద పుట్టును. ఆ కంచరగాడిదలకు తరువాత సంతానము కలుగకుండుటయు లోకవిదితము. ఇట్లు భిన్న జాతి స్త్రీ పురుష వ్యక్తులకు సమానాకృతి గల సంతానము కలుగదనుట నిశ్చి యము. కావున బ్రాహ్మణ క్షత్రియాదులు భిన్నజాతులకు జెందినవా రగునెడల వారిలో స్త్రీ పురుష సంబంధము వలన మాతా పితరులవంటి సంతానము కలుగక యుండవలయును. కాని, శ్రీ చక్రవర్తుల రాజ గోపాలాచార్యులు బ్రాహ్మణులు. వారి పుత్రికను గుజరాతి వైశ్యుడైన మహాత్మ గాంధిగారి కుమారుడు పెండ్లి చేసికొని సంతానము కనుట మన మెఱుగనిది కాదు. దేవదాసుగాంధి సంతానము నెఱుగనివా రెవరుందురు భారతమున! ఈ సంతానము - తమ తల్లి దండ్రులు వైశ్య బ్రాహ్మణ నామధారుల సంతానములయ్యు నొకే మానవజాతికి చెందినవారే యని చాటి చెప్పుట లేదా! కావున బ్రాహ్మణ క్షత్రియాది పదములు భిన్న భిన్న జాతివాచకములు కావని చెప్పుటకు ఇంతకంటెను ప్రబల ప్రమాణము లేమి కావలయును? నేడు భిన్న భిన్న కులనామములచే బేర్కొనబడు యువతీయువకు లెందఱో పరస్పరము వివాహమాడి తమవంటి చక్కని సంతానము కనుట నిత్యము చూచుట లేదా? ఆ యా కుల నామములచే వ్యవహరింపబడు వ్యక్తులు భిన్న జాతులవా రగుదురా? ఎన్నడు కారు. ఎల్లరు మానవజాతికి చెందినవారే. పై ఉదాహరణములను, లక్షణము లను గుర్తించి వాని ననుసరించి జాతియన నేమో తెలిసినమీదట బ్రాహ్మణ

క్షత్రియ వైశ్య శూద్రాది పదములు జాతివాచకములు కావని దనువరులకు స్పష్టమై యుండునని యెంచెద.

హిందువులలో కొందఱు బ్రాహ్మణాదిపదములు జాతివాచకములే యని చెప్పుచు వేదమంత్రము ప్రమాణముగా నుదాహరింతురు. ఎక్కువగా నిట్లు చెప్పువారు బ్రాహ్మణనామధారులే యనుట నిక్కువము. వారు యజుర్వేదములోని యొకమంత్రము నుదాహరింతురు.

"బ్రాహ్మణోఽస్య ముఖ మాసీద్ బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్ వైశ్యః పద్భ్యాం శూద్రోఽజాయత."
(యజు. ౩౧. ౧౧.)

ఈ మంత్రము నేకరువు పెట్టి దీని కర్థము నిట్లు చెప్పుదురు. "బ్రహ్మముఖమునుండి బ్రాహ్మణుడు, బాహువులనుండి రాజన్యుడు - క్షత్రియుడు, ఊరువుల (తొడల) నుండి వైశ్యుడు, పాదములనుండి శూద్రుడును పుట్టినాడు."

ఈ మంత్రమును, మంత్రార్థమును పురస్కరించుకొని పుట్టుకతో బ్రాహ్మణత్వము, క్షత్రియత్వము, వైశ్యత్వము, శూద్రత్వము సిద్ధించు ననియు, కావున బ్రాహ్మణాది పదములు జాతివాచకములే యనియు, బ్రాహ్మణ క్షత్రియాదు లొకరు మఱియొకరికంటె తక్కువ - నీచులు ననియు చెప్పుచుందురు.

ఇంతేకాక వేదములు ఈశ్వరీయములు కావున నవి స్వతః ప్రమాణము లనియు, వేదము చెప్పినది యంగీకరింపక వలనుపడ దనియు చెప్పి వేదాధ్యయనము చేయని యమాయికులను ఒప్పింప యత్నింతురు. కాని వాస్తవ మారయ ఈ బ్రాహ్మణ బ్రువులు చెప్పునది యసత్య మని తెలియకపోదు. ఈ మంత్రమునకు వారు చెప్పునది సరియైన యర్థము కాదని తెలిసికొనుట కష్టము కాదు. ఈ మంత్రమున

గల బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర పదములు జాతివాచకము లనుట కెట్టి యవకాశము లేదు. ఇందు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యాదులు బ్రహ్మము ముఖ బాహూరువుల నుండి పుట్టినా రనియు లేదు. ఈ మంత్రములో బ్రహ్మపదమున కెట్టి సంబంధమును లేదు. ఈ మంత్రము పురుషసూక్తములో గల అనేక మంత్రములలో నొక్కటి. దీనికి పూర్వమున నింకొక మంత్ర మున్నది. అది యిది.

" యత్ పురుషం వ్యదధుః, కతిథా వ్యకల్పయన్ ? ముఖం
కి మస్యాసీత్ ? కిం బాహూ ? కి మూరూ ? పాదా ఉచ్యేతే."
(యజు. ౩౧-౧౦.)

'ఏ పురుషుని వర్ణించిరో యతని నెన్నివిధముల కల్పించిరి ? అతనికి ముఖమేమి ? బాహువు లేమి ? ఊరువు లేమి ? పాదము లేమని చెప్పబడును ?' అని మంత్రార్థము. ఇయ్యది ప్రశ్నమంత్రము. ఇంతకు పూర్వము వ్రాసిన బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ .... " అను మంత్రము సమాధానమంత్ర మనబడును. కావున నీ మంత్రమున పై ప్రశ్నములకు సమాధానముగ కల్పిత పురుషుని ముఖ మేమి యన - బ్రాహ్మణుడనియు, బాహువు లేమియన - క్షత్రియు డనియు, ఊరువులు వైశ్యుడనియు, పాదములు శూద్రుడనియు చెప్పబడినది.

ప్రశ్నలలో బ్రహ్మముఖమునుండి జనించిన దెవరు ? అని కాని, బాహ్వాదులనుండి పుట్టిన దెవరనికాని యడుగనే లేదు. అట్టియెడ బ్రహ్మ ముఖాదులనుండి బ్రాహ్మణాదులు పుట్టినారని సమాధానము చెప్పుట యెట్లు సమంజసమగును ? ప్రశ్నమంత్రమును మఱుగు పఱచి ప్రశ్నల స్వరూప స్వభావములను తెలియనీయక బ్రహ్మ ముఖాద్యవయవములు బ్రాహ్మణాదుల జన్మములకు స్థానము లైనట్లును, కావున ముఖ బాహూరు పాదములు శరీరమున నొకదానికంటె నింకొక యవయవము క్రింద నుండుటచే నా యా యవయవముల నుండి పుట్టిన బ్రాహ్మణాదులు

జన్మతః - పుట్టుకతోనే ఒకరికంటె నింకొకరు నీచులు - తక్కువవారు అనియు కల్పించి వాని నాచరణలో బెట్టనెంచుట యెంతటి వంచనయో, ఘోరమో పాఠకు లూహింతురుగాక! బ్రాహ్మణాది పదములు జాతి వాచకము లనుటకు వేదమును ప్రమాణముగా చెప్పుట చదువుసంధ్యలు లేకున్నను పుట్టుకతోనే తమ ప్రాముఖ్యమును కాపాడుకొని సంఘమున పూజింపబడుటకు బ్రాహ్మణులు చేయు వంచనకాక మఱి యేమగును?

ప్రశ్నమంత్రమున గాని, సమాధాన మంత్రమున గాని, అంతకు పూర్వ మంత్రములందు గాని యెక్కడను కనబడని బ్రహ్మపద మీ 'బ్రాహ్మణోఽస్య ముఖ మాసీ' దను మంత్రమున నెటనుండి యను వర్తింతురో-అన్వయింతురో బ్రహ్మకే తెలియును. మానవులకు మానస గోచరము కూడ కాదు. బ్రహ్మపద మాకసమునుండి తెచ్చి పెట్టుకొంద మన్నను నది మంత్రమున నతుకదుకదా! ఎట్లో యతికించినను బ్రహ్మము నకు ముఖాద్యవయవముల నెటనుండి తేగలము? బ్రహ్మము విశ్వ వ్యాపక తత్త్వము గదా! అందు ముఖాద్యవయవము లెక్కడ? వాని నుండి బ్రాహ్మణాదులు పుట్టు టెక్కడ? ఎట్లో కల్పింత మన్నను ఆ కల్పనలో గల యౌచిత్యమేమి? బ్రాహ్మణాదులు పుట్టుటకు తగిన యోను లా బ్రహ్మ శరీరావయవము లందుండు పక్షమున నా బ్రహ్మ రూపము ఈ బ్రాహ్మణ భక్తులకు దర్శింప నర్హమగునా? శరీరమునం దంతట యోనులు గల బ్రహ్మము దర్శనీయము - సాక్షాత్కారయోగ్యము నగునా? దర్శించి వా రానందింతురా? ఇది యేమి కల్పన!

ఒకవేళ బ్రహ్మకు ముఖమే యుండి, అందుండి పుట్టినమాత్రమున బ్రాహ్మణుడు తక్కినవారికి పూజ్యుడు, వారికంటె శ్రేష్ఠుడు నెట్లగును? ముఖమునుండి పుట్టిన వన్నియు శ్రేష్ఠములే యగునని నియమ మెక్కడ? బ్రహ్మమునకు గల ముఖాద్యవయవములు బ్రహ్మముకంటె భిన్నములుగ వ్యవహరింపబడునా? అవయవ సంఘాతమే కదా బ్రహ్మము! ఒకే

బ్రహ్మమునుండి పుట్టినవారు భిన్నజాతులకు చెందినవా రెట్లగుదురు ? బ్రహ్మమునుండి జనించిన సంతానము బ్రాహ్మమే యగును కాని విభిన్నపదవాచ్య మెట్లగును ?

"న విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్"

(మ. భా. శాంతిప. ౧౮౮-౧౦)

కావున బ్రాహ్మణాది పదములు జాతివాచకము లనుటకు వేదమును ప్రమాణముగ జెప్పుట యెట్లు చూచినను సమర్థనీయము కాదు.

వేదమంత్రములందు పలుచోట్ల బ్రాహ్మణ క్షత్రియాది పదములు చూడనగును. కాని యెక్కడను నీ పదములతో జాతిపదము జోడించి ప్రయోగించుట చూడము.

"రుచం నో ధేహి బ్రాహ్మణేషు, రుచం రాజసు నస్కృధి ।
రుచం విశ్యేషు శూద్రేషు, మయి ధేహి రుచారుచమ్॥"

(యజు. ౧౮-౪౮.)

ఇందు బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్ర పదములు చూచుచున్నాము. ఇట్లే పలుమంత్రములందు చూతుము. ఎక్కడను బ్రాహ్మణ జాతి, క్షత్రియజాతి, వైశ్యజాతి. శూద్రజాతి యని జాతిపదముతో చేర్చి బ్రాహ్మణాది పదములు ప్రయోగింపబడుట చూడము. కావున బ్రహ్మముఖాద్యవయవములనుండి పుట్టుటచే బ్రాహ్మణాది పదములు జాతిని తెలుపును; జన్మముతోనే బ్రాహ్మణాదిపదవాచ్యులు భిన్నజాతులకు సంబంధించినవారగుదురు; అనుటయు పొసగదు. అయినచో 'బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ . ....' అను మంత్రమున కర్థ మేమగునని చదువరు లడుగవచ్చును. మానవజాతి నంతటిని విరాట్ పురుషునితో బోల్చి దానికి పురుషాకృతిని కల్పించినపుడు బ్రాహ్మణు డనబడువాడు ముఖమువంటివాడనియు, క్షత్రియుడు బాహువులవంటివా డనియు, వైశ్యుడు ఊరువులతో బోల్చదగినవా డనియు, శూద్రుడు పాదస్థానీయు డనియు చెప్ప

వచ్చునని మంత్రార్థ మగుచున్నది. కావున నీ బ్రాహ్మణాది పదములు గుణవాచకములే కాని జాతివాచకములు కావు. పురుషుని యాకారమును దెలుపు శరీరమునందు ముఖమున - శిరోభాగమున జ్ఞానేంద్రియములు - నేత్రాదులు అన్నియు నున్నవి. కావున జ్ఞానము ప్రధానముగ - ఎక్కువగ నుండువ్యక్తి, బుద్ధిబలముతో జీవించువాడు బ్రాహ్మణు డనబడును. బ్రహ్మ మనగా జ్ఞానము, వేదము, పరమేశ్వరుడు నని యర్థము. జ్ఞానము కలిగి వేదాధ్యయనాదుల నొనర్చి, పరమేశ్వర ప్రాప్తికై నిరంతరము యత్నించు వ్యక్తి బ్రాహ్మణు డని యర్థము. అట్లే 'క్షత్రం వై వీర్యమ్' క్షత్ర మనగా వీర్యము. పరాక్రమము, బలము మున్నగు గుణము లెక్కువగా గలవాడు క్షత్రియు డనబడును. క్షత్రియునియందు జాతిని, దేశమును రక్షించు గుణములు మిక్కిలిగా నుండునని భావము. అందువలననే బాహువులతో నతడు పోల్చబడును. శరీరమున కపాయము వాటిల్ల నున్నసమయమున బాహువులు ఆ యపాయమునుండి శరీరమును రక్షింప యత్నించును. తలపై నెవరైన కొట్ట యత్నించినప్పుడు వెంటనే చేతు లడ్డము పెట్టుకొని శిరస్సును దెబ్బలనుండి కాపాడుకొనుట నెవ్వ రెఱుగరు? ఇట్లే శరీరమును స్థిరముగ నుంచుటకు ఊరువులు తోడ్పడును. తొడలబలముతో నెక్కువ సమయము కూర్చుండ ననువగును. కావున మానవజాతిని పోషించుట కనువగు ద్రవ్యములను సేకరించి వానిమూలమున జాతిని పోషింప యత్నించు వ్యక్తి వైశ్యు డనబడును. అదేవిధముగ పాదములు శరీరము నిటునటు తీసికొని పోవుట కుపయోగించును. శరీరమును నిలబెట్టుటకు తోడ్పడును. పాదములవలె జాతినిలకడకు, జాతిజవసత్వములను కాపాడుటకు నుపయోగించు వ్యక్తి శూద్రు డనబడును. శరీరమునందలి ముఖాద్యవయవములు భిన్న భిన్న గుణములు కలిగియుండి శరీరస్థితికి సర్వవిధముల తోడ్పడునట్లు మానవజాతి పోషణకు, దాని మనుగడకు నవసరమగు గుణవిశేష

ములు కలిగిన వ్యక్తులు తోడ్పడుచుందురు. ఆ యా గుణవిశేషములను బట్టి మానవులు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రపదములచే వ్యవహరింపబడు దురు. అంతే కాని బ్రాహ్మణాదులు భిన్నజాతులకు సంబంధించిన వారు కారు. కావున వారిలో జన్మతః ఒక రెక్కువ మఱియొకరు తక్కువ యని యెంచుట యుచితముకాదు. శరీరమున గల యవయవములు వాని వాని కార్యములను సక్రమముగ నెఱవేర్చుచు శరీరస్థితికి తోడ్పడిననాడు శరీరయాత్ర చక్కగ జరుగును. అవయవములలో నేది చెడినను శరీర యాత్రకు, మనుగడకు భంగము కలుగును. అట్లే బ్రాహ్మణాదిపదములచే వ్యవహరింపబడు వ్యక్తులెల్లరు వారి గుణములకు దగినట్లు, శక్తిసామర్థ్య ముల ననుసరించి కర్తవ్యకర్మల నాచరించినంతవఱకు మానవజాతి చక్కగ వర్ధిల్లును. బాహువులు, ఊరువులు, పాదములు తోడ్పడనినాడు, కేవలశిరస్సు - ముఖ మేమి చేయగలుగును ? శిరస్సు తగినట్లు పనిచేయ కున్న బాహ్వాదు లెందుకైన పనికివచ్చునా ? అవయవము లన్నియు వాని స్థానమున నవి యారోగ్యము కలవియై స్వకార్యములను నిర్వర్తించిన నాడు శరీరమంతయు చక్కగ నుండును. అందువలననే జ్ఞానాదిగుణవిశే షములవలన బ్రాహ్మణాది పదములచే పిలువదగు వ్యక్తులు ముఖాద్యవ యవములతో పోల్చి వేదమంత్రమున చెప్పబడినారని గుర్తింపవలయును. అంతమాత్రమున బ్రాహ్మణాదిపదవాచ్యు లొకరికంటె నొకరు నీచుల నియో, ఉత్తములనియో యెంచి, ఒకరి కొకరు దూరముగ నుండి పర స్పరసహకారభావమును విడిచి యుండుట మానవజాతికి శ్రేయస్కరము కాదు. వేదమునం దందువలననే యొకచో "అజ్యేష్ఠాసః అకనిష్ఠాసః, ఏతే సంభ్రాతరో బభూవుః" మనుష్యులలో నొక రెక్కువ మఱియొకరు తక్కువ యని యెంచక మానవులెల్లరు భ్రాతృభావముతో నుండవలయు నని బోధించుట చూడనగును.

అటులయిన బ్రాహ్మణాది పదములు జాతిని బోధింపకున్న పక్ష

మున నవి యేమి బోదించును ? అను ప్రశ్న ముదయించును. మహర్షులు వానిని వర్ణబోధకములుగా నెంచిరి. వేదమున బ్రాహ్మణాదిపదములతో జాతిపదము కాని వర్ణపదము కాని యేదియు జోడించి ప్రయోగించినట్లు చూడము. కాని మహర్షులు వర్ణవాచకములుగా వానిని గ్రహించినట్లు సులభముగా తెలిసికొనగలము. "వృణోతే రితి వర్ణః" అను నిరుక్త ప్రామాణ్యమువలన వరింపదగినది - స్వీకరింపదగినది వర్ణమని తెలియు చున్నది. గుణకర్మల ననుసరించి స్వీకరించునది వర్ణమని యెంచవల యును. వ్యక్తిలో నున్న గుణకర్మములను జూచి, వానిని తగిన వర్ణము నకు అధికారిని చేసి బ్రాహ్మణాదిపదములచే వ్యవహరించుటయు వర్ణమన నగును. గురుకులమున నివసించి వటువు విద్యాబుద్ధులను నేర్చి స్నాతకు డగునాడు గురువు లతని గుణకర్మములను బాగుగ నెఱింగి బ్రాహ్మణాది పదములచే నతడు వ్యవహరింపబడుట కధికార మొసంగెడివారు. కాబట్టి బ్రాహ్మణక్షత్రియాదిపదములు వర్ణబోధకములే కాని జాతివాచకము లెన్న డును గావు. అందువలననే బ్రాహ్మణాదులను గూర్చి వివరించుచు కృష్ణుడు అర్జునునితో నేమనెనో చూడుడు.

"శమో దమ స్తపః శౌచం క్షాంతి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్."
(భ. గీ, ౧౮-౪౨)

"శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్." ౧౮-౪౩

"కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్." ౧౮-౪౪

"శమము, దమము, తపస్సు, శౌచము, క్షాంతి, ఋజుత్వము, జ్ఞానము, విజ్ఞానము నను గుణకర్మ స్వభావములుకలవాడు బ్రాహ్మణు

దనబడుచున్నాడు. శౌర్యము, తేజస్సు, ధృతి, దక్షత, యుద్ధమున పాఱి పోకుండుట, దానము, ఈశ్వరభావము ననున వన్నియు కలవాడు క్షత్రియుడు. అట్లే వ్యవసాయము, వ్యాపారము, పశురక్షణము ననునవి వైశ్యుడు చేయదగినవి. పరిచర్య - సేవచేయుట శూద్రుని స్వభావము.'

ఇట్లు గుణకర్మములు ముఖ్యప్రయోజకములుగ బ్రాహ్మణాది పదములు వ్యవహారమునకు వచ్చినట్లు భగవద్గీతా శ్లోకమువలన తెలియుచున్నది. ఈ వర్ణనసుబట్టి చూచినను బ్రాహ్మణాది పదములు జాతివాచకములు కావనియు, గుణవాచకములు - వర్ణవాచకములనియు బోధపడును.

జాతి నిత్యమగును. అది వ్యక్తి బ్రదికియుండగా మాఱదు. వర్ణము మాఱుచుండును. బ్రాహ్మణవర్ణు డొకడు క్రైస్తవాది మతాంతరములను స్వీకరించినపు డతడు బ్రాహ్మణపద వాచ్యుడు కాడు. అట్టివాడు బ్రాహ్మణాది పదములతో వ్యవహరింపబడ కుండుట లోకవిదితమే. బ్రాహ్మణాది పదములచే వ్యవహరింప బడువారు వారి కర్తవ్య కర్మలను విడిచి, యన్య వర్ణగుణముల నలవఱుచుకొనిన పక్షమున వారు బ్రాహ్మణాది పదములచే పిలువబడరు. ఈ విషయమునే మనుస్మృతి యిట్లు చెప్పుచున్నది.

అనధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమం
.... ....న శూద్రత్వ మాశు గచ్ఛతి సాన్వయః.

"ద్విజుడు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో నొకడు) వేదమును జదువక ఇతర విషయములందు పరిశ్రమము చేసిన పక్షమున నతడు వెంటనే తనవంశము - పరివారముతోబాటు శూద్రు డగును."

బ్రాహ్మణులైన తల్లిదండ్రులకు బుట్టినంత మాత్రమున బ్రాహ్మణు లగుదురను నియమము ప్రాచీనకాలమున నున్నట్లు కనిపింపదు. ఇతర వర్ణములకు బుట్టినవారు కూడ బ్రాహ్మణులు కావచ్చును. ఛాందోగ్యోపని

షత్తులోని జాబాలికథను జదివినవారికి పై విషయము స్పష్టమగును. జబాల పరిచారికయై బ్రదికినది. ఆమె పుత్రుడు జాబాలి - సత్యకాముడు. సత్యము చెప్పినందున నాటిఋషు లతనిని బ్రాహ్మణునిగ వ్యవహరించిరి. జబాల కుల మేమో తెలియదు. తనకెగరి సంబంధము వలన కుమారుడు జన్మించి నాడో కూడ తెలియదని యామె స్పష్టముగా చెప్పినది. అజ్ఞాతకులముల వారికి బుట్టిన జాబాలి - సత్యకాముడు బ్రాహ్మణు డైనాడు. ఇందు గుణ కర్మలే ప్రయోజకములు.

ఇట్లే క్షత్రియ కులమున బుట్టిన విశ్వామిత్రుడు, చండాలకులమున బుట్టిన మాతంగుడు బ్రహ్మర్షు లయినట్లు భారతాదులందు జూచుచున్నాము.

వేదాధ్యయనాదులవలన శరీరము బ్రాహ్మణ శరీరమగునని మనువు చెప్పుచున్నాడు.

స్వాధ్యాయేన జపై ర్హోమై స్త్రైవిద్యే నేజ్యయా సుతైః
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః. ౨-౨౮

'స్వాధ్యాయము, జపము, హోమానుష్ఠానము, వేదాధ్యయనము, ఇష్టుల నొనరించుట, ధర్మపూర్వకముగ సంతానమును గనుట, బ్రహ్మ యజ్ఞాది మహాయజ్ఞముల నొనర్చుట, అగ్నిష్టోమాది యజ్ఞముల నొన ర్చుట - అను వీనివలన శరీరము బ్రాహ్మణ శరీర మగును.' అను నీ మనువచనమును బట్టి చూచినను గుణకర్మలనుబట్టి బ్రాహ్మణు డనబడును కాని తల్లిదండ్రుల రజోవీర్యముల వలననే బ్రాహ్మణ తను వేర్పడదని తెలియుచున్నది. ఇంకను

శూద్రో బ్రాహ్మణతా మేతి బ్రాహ్మణ శ్చైతి శూద్రతామ్,
క్షత్రియా జ్జాత మేవం తు విద్యా ద్వైశ్యా త్తథైవ చ.

మను, ౧౦-౬౫

'గుణకర్మములవలన శూద్రకులమున బుట్టినవాడు బ్రాహ్మణు డగును. బ్రాహ్మణకులజుడు శూద్రు డగును. క్షత్రియవైశ్యులకు బుట్టినవారు కూడ అట్లే గుణకర్మములవలన బ్రాహ్మణు లగుటయు, శూద్రులగుటయు కలదు.'

ఈ సందర్భమున బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణముల స్వభావకర్మములను, గుణములను తెలిసికొనుట అవసరము.

బ్రాహ్మణులకు—

అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా
దానం ప్రతిగ్రహశ్చైవ బ్రాహ్మణానా మకల్పయత్. మను ౧-౮౮
శమో దమ స్తపః శౌచం క్షాంతి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్. భ.గీ.౧౮-౪౨

బ్రాహ్మణునకు చదువుట, చదివించుట, యజ్ఞము చేయుట, చేయించుట, దాన మిచ్చుట, పుచ్చుకొనుట: అను నియామక కర్మములు. (శమము) మనస్సునందు చెడ్డపని చేయు నిచ్ఛకూడ పుట్టనీయకుండుట- మనస్సును అధర్మమం దెన్నటికిని ప్రవర్తింపనీయకుండుట, (దమము) చెవి, కన్ను మొదలగు నింద్రియములను అన్యాయాచరణములనుండి తొలగించి ధర్మమందే నడపించుట, (తపము) సదా బ్రహ్మచారియు జితేంద్రియుడు నయి ధర్మానుష్ఠానము చేయుట, (శౌచము)-

అద్భి ర్గాత్రాణి శుధ్యంతి మనః సత్యేన శుధ్యతి
విద్యాతపోభ్యాం భూతాత్మా బుద్ధి ర్జ్ఞానేన శుధ్యతి. మను. ౫-౧౦౯

జలముచే వెలుపలియంగములు, సత్యాచరణమువలన మనస్సును, విద్యాధర్మానుష్ఠానములచేత జీవాత్మయు, జ్ఞానముచేత బుద్ధియు, పవిత్రము లగును. లోపలి రాగ ద్వేషాదిదోషములను వెలుపలి మలములను దూరము చేసి శుద్ధముగా నుండుటచేత, వివేచనాపూర్వకముగ సత్యమును

గ్రహించి యసత్యమును త్యజించుటచేతను నిశ్చయముగ పవిత్రు డగుచున్నాడు. ఇదియే శౌచము. (క్షాంతి) నిందాస్తుతి, సుఖదుఃఖ, శీతోష్ణ, క్షుధాతృష్ణ, హానిలాభ, మానాపమానములయందు హర్షశోకములను వదలి ధర్మమందు దృఢనిశ్చయుడై యుండుట, (ఆర్జవము) కోమలత-నిరభిమానము, సరలత - సరళస్వభావము కలిగియుండుట, కుటిలతాది దోషములను వదలివేయుట, (జ్ఞానము) సమస్త వేదాదిశాస్త్రములను సాంగోపాంగముగ జదివి, చదివించు సామర్థ్యము, వివేకము, సత్యనిర్ణయము, ఏవస్తువెట్లున్నదో దానినట్లే-జడమును జడముగాను, చేతనమును చేతనముగాను దెలియుట, నమ్ముట, (విజ్ఞానము) పృథివి మొదలుకొని పరమేశ్వరపర్యంతము పదార్థములను విశేషముగ దెలిసికొని వానినుండి యథాయోగ్యమగు నుపయోగము గొనుట, (ఆస్తిక్యము) వేదము, ఈశ్వరుడు, ముక్తి, పూర్వాపరజన్మములు, ధర్మము, విద్య, సత్సంగము, మాత-పిత - గురువు - అతిథిసేవ నెప్పుడు వదలక వీరి నెన్నడును నిందింపకుండుట - ఈ పదునైదు గుణకర్మములు బ్రాహ్మణవర్ణస్థులకవశ్యముగా నుండవలయును.

క్షత్రియులకు—

ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవ చ
విషయే ష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః. మను. ౧-౮౯

న్యాయముగా ప్రజలను రక్షించుట, పక్షపాతమును వదలి శ్రేష్ఠులను సత్కరించుచు, దుష్టులను దిరస్కరించుచు నన్నివిధముల నందఱిని బాలించుట, (దానము) విద్య, ధర్మము-అను వీనిప్రచారమందును, సుపాత్రుల సేవయందును, ధనాదిపదార్థములను వ్యయపఱచుట, (ఇజ్య) అగ్నిహోత్రాదియజ్ఞములను చేయుట - చేయించుట, (విషయే........శ్చ) విషయములందు దగులుకొనక జితేంద్రియుడయి సదా శరీరమును, ఆత్మను బలిష్ఠముగా నుంచుట.

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనం
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్'. భ.గీ.౧౮-౪౩

(శౌర్యము) వందలకొలది వేలకొలది శత్రువులతో నొంటిగా యుద్ధము చేయుటయందు భయపడకుండుట, (తేజము) సదా తేజస్వి - దైన్యమును వదలి ప్రగల్భుడై దృఢుడైయుండుట, (ధృతి) ధైర్యవంతుడై యుండుట, (దాక్ష్యము) రాజ ప్రజాసంబంధమగు వ్యవహారము లందును, సమస్త శాస్త్రములందును అతిచతురుడై యుండుట, (యుద్ధే....) యుద్ధమందు దృఢుడై నిశ్శంకుడై యుండి యెన్నటికిని వెనుదీయకయు బరువెత్తకయు నుండుట-తన్ను బ్రతికించుకొని నిశ్చయముగా విజయము కలుగురీతిని యుద్ధము చేయవలయు ననుట, తాను బరుగెత్తి పోవుటచేత గాని, శత్రువులను మోసపుచ్చుటచేతగాని జయము గలుగ నుండునేని అట్లే చేయుట, (దానము) దానశీలము కలిగి యుండుట, (ఈశ్వరభావము) పక్షపాతరహితుడై అందఱితో యథా యోగ్యముగ వర్తించుట, విచారించి యిచ్చుట, ప్రతిజ్ఞను పూర్తిచేయుట, దాని కెప్పటికిని భంగము కలిగింపకుండుట - అను నీ పదునొకండును క్షత్రియవర్ణము గుణకర్మములు.

వైశ్యులకు.... ....

పశూనాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవ చ
వణిక్పథం కుసీదం చ వైశ్యస్య కృషి మేవ చ. మను౧-౯౦

(పశూ....ణమ్) గోవులు మొదలగు పశువులను బాలించుచు వృద్ధిపఱచుట, (దానమ్) విద్యా ధర్మములను వర్ధిల్లజేయుటకు ధనాదులను వ్యయపఱచుట, (ఇజ్య) అగ్నిహోత్రాది యజ్ఞములను జేయుట, (అధ్యయనమ్) వేదాదిశాస్త్రములను జదువుట, (వణిక్పథమ్) అన్ని విధముల వ్యాపారము చేయుట, (కుసీదమ్) నూటికి నాలుగు, ఆఱు, ఎనిమిది, పండ్రెండు, పదియాఱు, ఇరువది యణాలకంటె నధికముగ

వడ్డీ తీసికొనక అప్పిచ్చుట, మూలమునకు రెండింతలు అనగా నొక రూపాయి యిచ్చిన నూకేండ్లలో రెండు రూపాయలకంటె నధికముగ పుచ్చుకొనకుండుట, ఈయకుండుట, (కృషి) పొలము పనిచేయుట - ఇవి వైశ్యుని గుణకర్మములు.

శూద్రునకు ....

ఏక మేవ హి శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్
ఏతేషా మేవ వర్ణానాం శుశ్రూషా మనసూయయా. మను. ౧-౯౧

నింద, ఈర్ష్య, అభిమానాదిదోషములను వదలి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల సేవ యథారీతిని చేయుచు నందువలన దాను జీవించుట యొకటియే శూద్రుని గుణకర్మము. ఇట్లు సంక్షేపముగ నాయావర్ణముల గుణకర్మములు వ్రాయబడినవి. ఎవరెవరియందు నే యే వర్ణముల గుణకర్మము లుండునో వారివారికి నాయావర్ణముల యధికార మీయ వలయును. ఇట్టి వ్యవస్థచే మనుష్యులందఱు నున్నతశీలు రగుదురు. ఏల యనగా దమసంతానము మూర్ఖత్వాది దోషయుక్త మయ్యేనేని శూద్రులయి పోదురను భయము ఉత్తమ వర్ణస్థులకు గలుగును. అట్లే బిడ్డలు కూడ దాము పై రీతి నడక గలిగి విద్యాయుక్తులు కారేని శూద్రులు కావలసివచ్చునని భయపడుదురు. ఇదియును గాక నీచ వర్ణస్థులకు నుత్తమ వర్ణస్థులగుట కుత్సాహము వర్ధిల్లును. విద్యా ధర్మములను ప్రచారము చేయు నధికారము బ్రాహ్మణుల కీయవలయును. ఏల యనగా వారు పూర్ణవిద్యావంతులు, ధార్మికులు నయియుందురు గనుక నాకార్యమును యథాయోగ్యముగ జేయగలుగుదురు. క్షత్రియులకు రాజ్యాధికారమిచ్చుటచే నెన్నటికిని రాజ్యమునకు హానిగాని, విఘ్నముగాని కలుగదు. పశుపాలనాదుల యధికారము వైశ్యుల కిచ్చుటయోగ్యము. ఏలయనగా వారీ కార్యములను బాగుగ జేయగలరు. శూద్రునకు సేవాధికార మీయవలయును. ఏలయనగా వాడు విద్యారహితుడు, మూర్ఖుడు నగుటచే విజ్ఞాన

సంబంధమగు కార్య మేదియు జేయజాలడు. కాని శరీరసంబంధమగు కార్యము లన్నియు జేయగలడు. ఈ రీతిని వర్ణములను ధర్మతమ యధికారములయందు ప్రవర్తింపజేయుట రాజు మొదలగు సభ్యజనుల కర్తవ్యము.

ఇక భారతీయులలో వృత్తులను బట్టి యెన్నో కులములు వ్యవహారములో నున్నవి. కులము జాతికాదు. చాకపని చేయువాడు చాకలి. మంగలిపని చేయువాడు మంగలి. పంతులుపని చేయువాడు పంతులు. కుమ్మరిపని చేయువాడు కుమ్మరి. చర్మముతో పనిచేయువాడు చర్మకారుడు- మాదిగవాడు. ఇట్లు ఎందరో వారి పనులనుబట్టి భిన్ననామములు గల కులపదములతో జెప్పబడుచున్నారు. జన్మము - జాతి - పుట్టుకతో నీకులములకు సంబంధము లేదు. కావున కులములను జాతులనుట తప్పు.

పైన జూపినవిధమున వైదికవర్ణవ్యవస్థను గుర్తింపవలయును. వైదిక వర్ణవ్యవస్థకు జన్మతో నెట్టిసంబంధము లేదు. కావున మానవులు తమలో జాతిభేదమును పాటింపక యెల్లరు నొకేజాతికి చెందినవారుగా నెంచి యెల్లరు నెల్లరియోగక్షేమములకు పాటుపడుచు మానవాభ్యుదయమునకు తోడ్పడుట శ్రేయస్కర మగును. జాతిభేదమును పురస్కరించుకొని వ్యవహారములో నున్న ఉచ్చనీచభావములను విడనాడుట బుద్ధిమంతులకు కర్తవ్యము. విశ్వసౌభ్రాతృత్వమున కయ్యది తోడ్పడును. విశ్వశాంతి కదీ సాధన మగును.

ఓమ్ తత్ సత్

# అంబాదర్శన గ్రంథమాల

## ఆర్య సమాజము - కూచిపూడి - 522 313

## మా ప్రచురణలు

1. సత్యార్థప్రకాశము
2. వేదతత్త్వ ప్రకాశము (ఋగ్వేదాది భాష్యభూమిక)
3. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము 1-భాగము
4. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము 2-భాగము
5. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము (ముద్రణలో) 3-భాగము
6. శ్రీమద్భగవద్గీత
7. శ్రీ స్వామి దయానంద సరస్వతి జీవిత చరిత్ర
8. అర్షధర్మ మీమాంస
9. డా. వం. గోపదేవ్ ఆత్మచరిత్ర
10. గురువు విరజానంద జీవితచరిత్ర
11. ఈశావాస్యోపనిషత్తు
12. కేనోపనిషత్తు
13. కఠోపనిషత్తు
14. ప్రశ్నోపనిషత్తు
15. ముండకోపనిషత్తు
16. మాండూక్యోపనిషత్తు
17. తైత్తిరీయోపనిషత్తు
18. ఐతరేయోపనిషత్తు
19. శ్వేతాశ్వతరోపనిషత్తు
20. ఛాందోగ్యోపనిషత్తు
21. బృహదారణ్యకోపనిషత్తు
22. న్యాయదర్శనము
23. వైశేషికదర్శనము
24. సాంఖ్యదర్శనము
25. యోగదర్శనము
26. వేదాంతదర్శనము (వ్యాసకృత బ్రహ్మ సూత్రములు)
27. ఆస్తికవాదము
28. ఆర్యాభివినయము
29. ఆర్యగృహిణి
30. సంస్కారవిధి
31. ఈశావాస్యోపన్యాసములు
32. పూజ
33. వైదికదినచర్య
34. వైదికవినతి (స్వాధ్యాయమంజరి) 1-భాగము
35. వైదికవినతి (స్వాధ్యాయమంజరి) 2-భాగము
36. ఏసుక్రీస్తు రహస్యజీవనము
37. వ్యవహార భానువు
38. బ్రాహ్మణగోవు (గవిసూక్తము)
39. మాతృభూమి స్వరాజ్యము (పృథ్వీసూక్తము)
40. ఆర్యావర్తవాణి
41. ఆర్యసమాజమననేమి ?
42. ఈశ్వరుడు ప్రత్యక్షసిద్ధమా ?
43. అవతారాది కరణము
44. వైదిక త్రైతవాదము
45. ఈశ్వర స్వరూపము
46. వైదిక వర్ణవ్యవస్థ
47. వేదమే ఈశ్వరీయము (బైబిలు - ఖురానులు కావు)
48. హేతువాది దయానంద
49. శంకరపీఠాధిపతులు - అంటరానివారు
50. అహం - నేను
51. మనము హిందువులమా ?
52. శ్రీరామనవమి - సీతాకళ్యాణము
53. గోకరుణానిధి
54. జాతీయత
55. వేదాంతి ధ్వాంత నివారణము
56. భాగవత ఖండనము
57. దర్శనములు
58. లక్ష్మీసూక్తము
59. ఓమ్స్మర
60. ఆర్యసమాజనియమములు - ఉపనియమములు